పోలాల అమావాస్య

http://www.vipravanam.com/




శ్రావణ బహుళ అమావాస్య రోజును  పోలాల అమావాస్య అని అంటారు. ఈ పండగ కు కందమొక్క మరియు బచ్చలి మొక్కకు పూజ చేస్తారు. పూజలో ఒక కథ కూడా చెప్తారు. ఇది పెళ్ళయిన ఆడవాళ్ళు పిల్లల కలవారు వారి శ్రేయస్సు కోసం చేస్తారు.  పిల్లలు లేనివారు పిల్లలు కలగటానికి ఈ పూజ చేస్తారు.  ఈ పూజలో ఆడపిల్లు కావాలనుకునేవారు గారెలు దండ అమ్మవారికి వేస్తామని, మొగపిల్లలు కావలి అనే కోరిక కలవారు పూర్ణం బూరెలు దండ అమ్మవారికి వేస్తామని మొక్కుకుంటారుట.  ఈ పోలేరమ్మకు గౌరీదేవి పూజ చేస్తారు.  నివేదనగా నవకాయ కూర చేస్తారు, ఇంకా పప్పు తాలికలు, పాలతాలికలు, మినపకుడుములు చేసి అమ్మవారికి నేవేదిస్తారు.

పండుగ ప్రాశస్త్యం: ఒక ఊరిలో ఏడుగురు అన్నదమ్ములుండేవారు. వారికి పెళ్లిళ్లయి భార్యలు కాపురానికి వచ్చారు. చాలామంది పిల్లలతో వారంతా సుఖంగా కాలం గడుపుతున్నారు. అందులో, ఏడో కోడలికి ఏట పిల్లాడు పుడతాడు. కానీ పోలాల అమావాస్య రోజు చనిపోతాడు. అలాగా ఆరు సంవత్సరాలు జరుగుతుంది. అప్పటికే ఆమె తోడికోడళ్ళు దేప్పటం మొదలుపెడతారు - ఆమె వలన వారు ఆ పండుగ జరుపుకోలేకపోతున్నారు అని. ఆ బాధ భరించలేక ఏడవ సంవత్సరం పిల్లాడు కోన ఊపిరితో ఉండగానే అతడిని ఒక చాపలో చుట్టేసి ఉంచేస్తుంది. అందరూ పూజ చేసుకుంటారు. అది అయ్యాక, ఆమె ఆ బాబుని భుజం మీద వేసుకుని స్మశానానికి ఏడుస్తూ వెళ్తుంది. అది చూసిన పార్వతీపరమేశ్వరులు వృద్ధదంపతుల రూపంలో ఎదురయ్యి  "ఎవరమ్మా నీవు? ఎవరా బాబు? ఎందుకు ఏడుస్తున్నావు?" అని అడుగుతారు. దానికి ఆమె - "ఎవరైతే ఏమిటమ్మ - మీరు ఆర్చేవారా తీర్చేవారా?" అని అడుగుతుంది. దానికి వారు - "మేమే ఆర్చేవారము - తీర్చేవారము - చెప్పవమ్మా" అంటారు. ఆమె తన గోడు చెప్పుకుంటుంది. వారు ఓదార్చి అంతా శుభం కలుగుతుంది అని చెప్పి వెళ్ళిపోతారు. అప్పుడు ఆమె భుజం మీద ఉన్నా బిడ్డతో సహా, ఇదివరకు చనిపోయిన బిడ్డలు కూడా లేచి వచ్చేస్తారు. వారిని చూసిన ఆశ్చర్యంలో ఆ దంపతులను చూద్దాం అని తిరిగేసరికి వారు ఉండరు. అప్పుడు - అది పార్వతీపరమేశ్వరులు అని తెలుసుకుని ఆనందంగా ఇంటికి వెళ్ళిపోతుంది. అక్కడ ఆమె తోడికోడళ్ళు ఈమె అదృష్టానికి అబ్బురపోయి క్షమార్పణ చెప్పుకుంటారు. అప్పటినుండి ఆమె ప్రతి ఏట తప్పకుండా పోలాల అమావాస్య పూజ జరుపుకుంటుంన్నారు."

ఈ కథ విన్న తరువాత చెప్పినవారు: "పోలేరమ్మ, నీ ఇల్లు పాలతో, నేతితో అలుకుతాను. నా ఇల్లు ఉచ్చతో, పియ్యతో అలుకు", అంటారు. వినడానికి కొంచం వింతగా వుంటుంది. కాని అది వారి పిల్లల మీద ప్రేమకు గుర్తుగా కనిపిస్తుంది . ఆ కథ అక్షింతలు చదివినవాళ్ళు, విన్నవాళ్లు తలపై వేసుకుంటారు. తరువాత పూజలో పసుపు కొమ్ముకు దారం కట్టి తోరం చేసి ఆ తోరాన్ని చేసి పూజ అయ్యాక ఆ పసుపుకోమ్మును చిన్నపిల్లలుకు కడతారు. అది వారికి రక్షగా వుంటుంది అని భావిస్తారు.

వల్లూరి పవన్ కుమార్

- గ్రేటర్ వరంగల్, బ్రాహ్మణ సేవా సమితి